# బుద్ధోత్పత్తి.

గ్రంథకర్త

భ. చి. యజ్ఞనారాయణ.

## వి జ్ఞ 

చదువరులారా!

నామిత్రులు కొందరీచరిత్రంబును వ్రాయుమని నన్ను బ్రోత్సాహపరుప నిది వ్రాసితిని. వారలకు యమకంబన మిగుల ప్రీతి కావున కొన్ని పద్యంబుల యమకంబముతో వ్రాసితి. అచ్చటచ్చట యమకంబునకు నీమభంగమయినను రసభంగము మాత్రము కాకుండ వ్రాసితి. రసగ్రహణ పారీణులగు వారలిది తెలియ జాలకుందురా! ఈకథ మిగుల క్లుప్తపరచి అచ్చటచట దగుపాటి మార్పుల గూడ చేసి వ్రాసితిని. "సారంగముల సౌరుమేర మీరుచు కేరుసారంగముల సౌరుమేరమీరు" అన్న పద్యము క్రమాలంకారము. అందుగల సారంగముల కర్థం బెద్దియన 1. కూర్మములు 2. భృంగములు 3. హరిణములు 4. సింగములు 5. విండ్లు 6. కోకిలలు 7 హంసలు 8. కాంచనము. ఈమీది పదములు క్రమాలంకారమందుననుంచిన నర్థమగును. "ప్రమోదోధీమతామపి" యని ధీమంతులకే ప్రమాదము సంభవించుచుండ నాబోటి వారికి తప్పులుండుటబ్బురమే? రసగ్రహణ భారంబు రసజ్ఞులకే వదలి యింతతో విరమించుచున్నాను.

మాడుగుల, 1-1-1913.

విద్వజ్జన విధేయుడు,
భ. చి. యజ్ఞనారాయణ.

ఓం నమః గురునాథాయ.

శ్రీగురుచరణారవిందాయనమః.

# బుధోత్పత్తి.

శా. శ్రీభామామణియైన రుక్మిణి "హరీ! కృష్ణా! జగన్నాథ! రా
వే! భూమీధర ధారి చేకొనవె, నీవేదిక్కు రాజీవనే
త్రా! భోగీంద్రశయాన" యంచవుడు తన్ బ్రార్థింపగా వచ్చివే
నాభాస్వజ్జఘనన్ వివాహమగునబ్జాక్షుండు ప్రోచున్ మిమున్ 1

క. మిత్రులోక దివసమందున
నత్రికుమారునకు నల బృహస్పతికిన్
పుత్రుడుదయించెనా చా
రిత్రంబును పద్య ఫణితి లిఖయింపుడనన్. 2

క. నరియేయని వారలకని
గురువరు మదిలోదలంచి కొంకక నేనీ
చరితంబు వ్రాయ బూనితి
గురువరు పదభక్తియున్న గొదువ కలుగునే. 3

గీ. అత్రికొడుకు చంద్రుండు బృహస్పతి దరి
విద్యల బఠింపుచుండనా వేలుపుదొర
గురునిదా జేయు యాగంబు కొరకు రమ్మ
టంచు నొకవార్త బంపించె మించుకూర్మి. 4

అంత నాసురగురుండును 5

మ. తనకాంతామణియైన తారగని "యోతన్వీ!" సురేశుండు తా
పొనరింపగ దలపెట్టె యాగమును సమ్మోదంబుతో నన్ను ర
మ్మనె, నాకంబునకేగ గావలయు నేనచ్చోటికిన్ బోదు బ్రే
మను నీవీశశినెల్లు చూచెదవొ సుమ్మా! యంచు వాక్రుచ్చుచున్.

గీ. తన ధవుడు స్వర్గమునకేగ దార చంద్రు
దారసిలి చిలక బాబా వజీరుపోరు
లోన వానిని ధన్యునిగా నొనర్చి
గడియలిప్పగా కాలంబు గడుపునంత. 7

క. సురనాథుని యాగమ్మును
పరిపూర్తి నిజేసి గురుడు భార్యాలోకా
భిరతిన్ గృహసీమకు తా
నరుదెంచెను కొంతకాలమయ్యెడి సరికిన్. 8

శా. తారాచంద్రుల భాషణంబువలనన్ తమూ్రివుచే జెట్టలన్
సారంగారి యొనర్చెనంచును హృదాబ్జం బందు చింతించితా
దారన్ బిల్చి నిజంబడుంగ నది సత్యమ్మంతయుఙ్ జెప్పగా
పోరా! చంద్ర! వివేకశూన్య! ఖల! పో! పొమ్మంచు నత్యుగ్రతన్. 9

ఉ. అంతట చందు్రినప్పుడు బృహస్పతి పొమ్మని చెప్ప నెమ్మదిన్
వంతదురంతమై కనుల భాష్పకణంబులు నేలరాల సీ
మంతిని దారబాసెడి ప్రమాదము సంభవమయ్యెనంచు తా
జింతిలి యెట్టకేలకు వచించె గురూత్తముతోడ నిట్టులన్. 10

చ. గురవర! పూజనీయనుత! కోవిదవర్య! గుణాలవాల! నే
నెరిగియు నేరకో తమకు నగ్గలొనర్చితి వానినైచియే
మరక కృపార్ద్ర చిత్తత దయన్ గనుగొండిదె పోయి వత్తమీ
చరణయుగాంబుజంబులకు సాగిలిమ్రొక్కెద గైకొనుండిదే 11

చ. అనిధరజాగి మ్రొక్కి యమృతాకరుడా గృహసీమబాసి కా
ననమున జొచ్చి తారను మనస్సున నెంచి విచారచిత్తుడై
వనజదళాక్షి నిన్నిటుల బాయుదునం చొకనాడు నైననే
ననుకొననట్టిచో విధియహా మనసీగతి వేరుజేసెనే. 12

ఉ. నాతిరో! నిన్నుబాయఁగలనా లలనా కలనైనఁగాని సం
ప్రీతిని నిన్నుఁగూర్చి జపమే నిపుడే పొనరించువాఁడ నా
కీతరి కౌఁగలీయఁగదవే పదవే సుదతీవరాంగి యా
హా! తమిదీర్పుమింక చెలియామల యానిలుడాకకోర్వనే. 13

సీ. వగలు గుల్కెడిదాని బగడాల జిగిజాల
నగఁజాలు సొగను మోవిగలదాని
అతివిలాసవుదాని మితిమీర రతిజారు
మతిమారు జేయు నంగతులదాని
మొలకనవ్వులదాని తులలేని వెలలేని
జలజమ్ము నవ్వు మోమలరుదాని
ఘనకుచమ్ముల దాని వనజమ్ము ననిశమ్ము
కలనమ్ము నకు విల్చు కనులదాని
జిలుగుకంచెలదాని నవ్వలరుదాని
చిలుక పలుకులు గలదాని వలపుదాని
సొంపుగలదాని ముద్దువాల్జూపుదాని
నెన్నఁడేగందు కౌఁగిలి నెపుడు గొందు. 14

సీ. సారంగముల సౌరు మేర మీరుచు కేరు
సారంగముల సౌరు మేరమీరు
సారంగముల సౌరు మేర మీరుచు కేరు
సారంగముల సౌరు మేరమీరు
సారంగముల సౌరు మేర మీరుచు కేరు
సారంగముల సౌరు మేర మీరు
సారంగముల సౌరు మేరమీరుచు కేరు
సారంగముల సౌరు మేరమీరు
పాదములు కుటిలాలక పాశములు మ
నోహరాక్షులు నడుము కన్బొమలు పలుకు
లతివ యానము పైదీవ యట్టిదాని
మూడులోకంబులందు నేజూడనెందు.

సీ. అలజక్రొవలనిక్కు బడద్రొక్కు గలబెక్కు
గలయట్టి కులుక్రొగుబ్బల మిటారి
బలుకెంపు లలిపెంపు తులకింపు పవడంపు
జిగిమోవిగలకంతుచే కటారి

కమలమ్ములను దొమ్మి కలనమ్మునను రెమ్మ
నయనమ్ములను బొల్చు నాతిమిన్న
కరిమ్యగమియు బ్యగని నిబ్బరము గుబ్బ
తిలగొబ్బు ఘనవేణి యులరుయన్న
కలికిపలుకున క్రప్రంపు పలుకు జిలుక
చిలుకపలుకుల చిల్కువజీరుములుక
లస్లుపలుకుదు మోహంపు టలకుజూపు
కాంతనెప్పుడు కాంచు భాగ్యంబు కలుగు. 16

సీ. పాటలాకపురంపు మూటలా యమృతంపు
తేటగాపసనింపు మాటలరయ
కోపులాతలముస్క చేపలామరు చేతి
తూపులాయలనాతి చూపులరయ
కొండలాబంగారు గిండులాజాజిపూ
చెండులా సుదతి పాలిండులరయ
హేమమాఘనతటి శ్యామమాళ్యంగర
ధామమాభామమై సీమయరయ
చేతులాలతాజాతులా సిగ్గులెలుపు

చందమాయరవిందమా మందయాన
నవ్వుమోమందమా యట్టి నళినవదన
నెందునేగానను జగాన మంజువైన. 17

ఉ. పొమ్మని యొజ్జసెప్పగను పోవగ జెల్లున నేనుపోనుకా
నిమ్మని వానితో నన మరేమి యొనర్చగలాడునాడుకా
ర్యమ్మికతప్పివచ్చె విరహమ్మున కోర్వగజాల నెట్టులా
కొమ్మను చూడగల్గుదును కోరికదీర రమించుటెన్నడో. 18

క. సతియా! కాదది బంగరు
ప్రతిమయే! యదికాదు మోహలతయే! కాదా
రతియో! భారతియో! నా
మతియో! నాగతియొ! నారమణియో! మణియో!. 19

చ. "మగడుమగండనంగ మది మక్కువ యెవ్వసియందుకంటికిం
పగు నతడెవ్వ రో యతడె" యంచును నాటిదినమ్ము నందునా
మగనికినాన్యాఖ్యజెప్పి యనుమానముమానిపి నన్నుగూడునీ
వగలకునీయగావలదె పద్యము లోకప్రసన్నవంగనా!. 20

ఉ. ఇంతులమిన్న యొక్కపరి నిర్వ్వరమున్ రతిదేలనీవు ర
త్యంతమునందు సిగ్గువడి యంగము డాచికొనంగ ''చాలు లే
యింతకుమున్న లేనిదిది యొక్కడనుంచరుడెంచె'' నాగ సా
మంతవు చూపుచూచు వరమానినినిన్ మదిలో దలంచెదన్. 21

ఉ. పున్నమచంద్రుబోలు మొగమున్ జలజాళిమునుంగ జేయువాల్
కన్నులు కుంభికుంభముల ఖంగును టింగున మొట్టునట్టిబల్
చన్నులు కంధరంబుల పసన్ వినువీధికి బారద్రోలు నా
కన్నియవేణి దానిసరి కాంతలు లేరు దిగంతరంబులన్. 22

ఉ. మానసమందు నన్ను హరిమారుగ జూచుచు నాదు నామమున్
ధ్యానము చేయుచున్ ననుసదా భజియించెడు మానినీమణిన్
పీనపయోధరన్ సతిని భీతమృగేక్షణ గామదేవతన్
మానితబంధురాలకను మానసమందున గొల్చుచుండెదన్. 23

ఉ. జలకములాడి హైమపసపు చాలనలందగ నెంచి స్వీయపూ
తలువ వదల్చి యొక్కవనిపై యటకేజన సిగ్గుచేత నూ
మలరగవచ్చి ''యిల్లు తగునా జలకంబుల నామెచుండు తో
య్యాలిదరికేగవచ్చునె'' యటంచు వచించు సతిన్ దలంచెదన్.

---

ఉ. కాంతరో! నీవుపాలుపితుకన్ తలుపోరగ జేసినేను దన్
బంతుల నెత్తనంతట భవత్పతి యచ్చటి కేగుదేరనా
వంతయు జంకకాతనికి నడ్డముగా జని "గద్దితెమ్ము వే
కాంతుడ" యంచుబల్కి డివగల్ గలపోసెద నేమనమ్మునన్. 25

చ. అనిబహుభంగులన్ సతిసుధాంశుడు నెమ్మది నెంచునంత న
య్యన నొకచిల్క వచ్చి వినయమ్ము నయమ్మును దోపవ్రేల వ్రా
లినదదిగాంచి యద్భుతము రెట్టిపడంగను దానికంఠమం
దునగల కాకితమ్ముగని తోసముతో నదిదీసి విప్పుచున్. 26

క. అది తనప్రియయగు తారా
బ్జదళాక్షియె పంపెనందు భావమ్మునతా
నుదలచి యది యీరీతిని
చదువంగా దొడగె సంతసము పెనుగొనగన్. 27

ఉ. "ఓరమణీయరూప! తమ రొయ్యన నన్నెడబాయ నల్లుడా
మారుడు పజ్జజేరి యనుమానము భీతి త్యజించి చెప్పగా
నేరనియట్టిబాములవి నీలిని బెట్టుచునున్న వాడు, రా
రా! రతిదేల్పరా! సతినిరా! కరుణించర! యోసుధాకరా!

ఉ. తారను, ప్రేమమైనా నినునదా భజియించెడిదాననే భవ
దారను, నీసురూపము ముదమ్మునజూచి విశేషప్రేమనీ
పై రహిదాల్చి నిన్నడసి ప్రాణము మేనవహించినాను, రా
రా! రతిదేల్చరా! నతినిరా! కరుణించర! యోసుధాకరా!.

ఉ. తాపముదీర్చరా! ననుముదమ్ముననేలర! బ్రోవరార! యీ
కోపముమానరా! నను స్వకోమలిరీతిని చూచుకోర! నా
పాపముకాని యిట్టి పతివల్లను సౌఖ్యములేమినాకు, తా
రాపతియన్నమాటను పరాకునుచెందకురా! సుధాకరా!. 30

ఉ. వచ్చిననింద వచ్చెనది వద్దనినన్ మరిపోదు కాన నా
ముచ్చటదీర్చినీదు నగు మోమొకసారి క నంగ జేసి లో
హెచ్చినమోదమందుచు రతీశ్వరు సంగరమందునేలి యీ
యిచ్చలదీర్చి ప్రేమగనుమీ వినుమీ మనవిన్ సుధాకరా. 31

ఉ. నించరకూర్మినన్ను కరుణించర తాళగజాలముద్దు చె
ల్లించరమించుకూర్మిని వరించర యిచ్చటకీవువేగ నే
తెంచర పూర్వసఖ్యము మదిన్ దలపోయర నిన్నుబాసి జీ
వించర కౌగలీయర భువిన్ నినెనమ్మితిరా సుధాకరా. 32

సీ. నీమీఁది ప్రేమచే బాములందెడిదాని
నీప్రాపు నొందగా నెంచుదాని
జాణవటంచు నీసరస జేరినదాని
వెసనిన్ను గలయగా మసలుదాని
రతినాథుచేచాల వెతలు చెందెడిదాని
ఘనముగా నిన్నది గాంచుదాని
మిగులరూపసివంచు మిమ్ముగోరినదాని
నాకాముడవటంచు నమ్ముదాని
మేని మిసమిసజూచి కామించుదాని
విశ్వమీవేయటంచు భావించుదాని
మీరియున్న కోరికదాని మిమ్ముగాంతు
ననిదలంచెడిదాని నన్నాదరించు. 33.

ఇట్లు
భవత్ప్రియసి-
తార.

ఆలేఖం గాంచి శశాంకుండానంద హృదయారవిందుడై యా

చిలుకంగని ముద్దాడి తద్దయు కొంతప్రొద్దుపుచ్చి తన ప్రియకాం
తామణికి కమ్మవ్రాయనెంచి కాకితంబు లేమికి చింతించి, తార
పంపినలేఖకు రెండవవైపున వ్రాయదొడంగె. 34

ఉ. మంగళమస్తు నీకు కుచమార్దవసంపదకున్ ముఖమ్మునకున్
మంగళమస్తునీదు జఘనమ్మునకున్ మధురంపుమోవికిన్
మంగళమస్తు నీతగు కనత్కనకమ్మును గేరుమేనికిన్
మంగళమస్తు రూపజితమన్మథరాణిరో! నాదు ప్రాణిరో! 35

సీ. మానినీ! నీలేఖ మమ్ముల జేరెను
కనుబార దానిని గాంచినాడ
నోకాంత విన్నననూహ సెనర్చితి
భామినీ నీపైని ప్రేమమున్న
దంచుచెప్పుటకు కందర్పుడే సాక్షియా
న్యాయమాయీరీతి వ్రాయనీకు
నాజ్ఞయొనర్పనేనప్పుడే నరుదెంతు
మీనాక్షి నీవిట్లు మేలమాడ
రాదు నీకు న్యాయంబిది కాదు సత్య
మియనంగుడు క్రూరుడై యేచదొడగె

జాణ! నీకౌఁగిలిచ్చి నీసరస జేర్చి
నను గృపఁ గనుఁగొమ్మిక నళినవదన. 36

చ. గురుని మహాగ్రహమ్మునకు గొంకి నిను౯ విడనాడి కాననే
జారబడినాడ నిన్నెపుడు జూతునొకో యని నెమ్మనమ్ములో
నరయుచునుంటినట్టియెడ నందెభవల్లిఖితంపులేఖ కాం
తరో! విను మొందుదెల్పెద ముదమ్మును జెందెద నీవు కోమలీ 37

చ. అలుకను బొందనిమ్ము గురుడందరున౯ గడుమూరనిమ్ము వే
ల్పులునను నవ్వనిమ్ము సురపూజ్యులు వృద్ధులు నాదు తల్లిదం
డ్రులు నను దిట్టనిమ్ము సఖిరో! వచియించెద నిన్ను నెయ్యపు౯
లలనగ గొంచుపోయెద సురప్రభుడడ్డము వచ్చినిల్చిన౯. 38

గీ. రెండుగంటలరాత్రియై యుండుసరికి
మనవనమ్మున కేను క్రమ్మరను వత్తు
తప్పదచ్చోటికి౯ రమ్ము తప్పకీవు
రమణి

ఇట్లు
నీప్రియుఁడు
సారంగధరుఁడు. 39

చ. అనియొకకమ్మవ్రాసి యమృతాకరుడా శుకకంఠసీమ ను
య్యానముడివెట్ట తుర్రమని యప్పుడె యాశుకమేగెనంత నా
వనజుడు చల్లగాడ్పుల జవమ్మునకుఁ వెరపొంది లోగికాం
తను మదిలోదలంచుచు క్షణమ్మొకయబ్దము రీతి[illegible]చ్చుచుఁ. 40

క. మును తనసతికిన్ లిఖయిం
చిన చొప్పున నాతడు వనసీమకు వేవే
జనుదెంచె, నంతకమ్మన్
గనుగొని యాతార రేయి కాగా నంతఁ. 41

గీ. ఇంటగల యట్టిభోజన కృత్యములను
వేగ నెరవేర్చి పతిని శయ్యాగృహమున
జేర్చి రతిదేల్చి నిదురింపజేసి చంద్రి
దరికి నేగగా నెమ్మది నరసిలేచి. 42

క. శయ్యాగృహంపు తలుపుల
నొయ్యనతామూసి కాంతుడుండెడికడకుఁ
దయ్యనజని రతిగూడుచు
నయ్యతివయు వానితోడ నరిగెను పిదపఁ. 43

చ. సురగురుడంత లేచి తనసుందరి లేమిని దివ్యదృష్టిచే
నరసి శశాంకుతో జనెనటంచును నారసి వేగ లేచి తాం
తరగ సురేశుసన్నిధికి తాజని వానినిగాంచి చింతనై
జరిగిన దానినంతయు వెసఁ నుడువంగ నతండు కిన్కమై. 44

ఉ. దూతను బిల్చి ఘోరివడితో యజశాత్రవుడున్న చోటికీ
వీతరిబోయి "మాగురుని యింతిని బంపుమటంచు భూధరా
రాతివచించెనంచు నటురామనుబంపక తప్పితేని వే
నీతలభూతలమ్మునకు నిచ్చెద" నంచు వచించు నావుడున్. 45

గీ. అంత సురదూత చంద్రుని యండకరిగి
వజ్రితనతోడ జెప్పిన వార్త జెప్ప
మండి పడియేమి సురవల్లభుండు నన్ను
జంపువాడె సరే! యాజి జరుగ నిమ్ము. 46

అనిచంద్రుండు దేవదూతకు ప్రత్యుత్తరమిచ్చి యుద్ధంబే కర్జం బనియెంచ నీవార్త నారదమునీంద్రునిచే శుక్రుండువిని రాక్షసబలంబును చంద్రునకు సహాయంబుగా బంప నప్పుడు జంభారికిని

జలజారికి దారుణరణంబు జరుగ గామారి దేవతలకు సహాయం
బుగా గాండీవంబు ధరించి శశాంకుండు ప్రళయకాల ఝంఝా
మారుతంబుభంగి యాజి నొనరింపుచుండ నలువ ప్రవేశించి యుద్ధం
బుమాన్పి తారను బృహస్పతికిచ్చి పంపె నంతట. 47

ఆ. వె. ఘనపాండిమంబు కౌనధికంబును
చన్నుమొనలు నలుపు సన్నగిల్లె
జవము తారకపుడు చంద్రుడు మితిలేని
సంతసంబుబొంద స్వాంతమందు. 48

గీ. తారయీరీతి గర్భంబుదాల్చి నెలలు
నిండ సుముహూర్తమందున రెండవ మరు
డనగ నొప్పెడి పుత్రునింగనియె దార
సాలనాటికి నేతెంచె చంద్రుడంత 49

గీ. నాకుమారుడటంచును నళినవైరి
మత్కుమారుడటంచు నమరగురుండ
నంగ నీదెబ్బలాట మాన్పంగదలచి
నలువ తాయేతెంచి తారను బిలిచి యడుగ. 50

క. సతి యీయిర్వురిలో నీ
సుతుఁ డెవరికి గంటివనగ సుదతీమణితా
చతురతగ మోము నాల్చుచు
నతనికి నేఁగంటిననుచు నజ్ఞుసి చూపెన్. 51

గీ. అంత నా పుత్రిచంద్రిన కర్పణంబు
చేసి యాబృహస్పతి జనె శీతకిరణు
డా శిశువునకాఖ్యను బుధుడంచు బెట్టె
నిదె బుధోత్పత్తి యనుచు సుహృదులకపుడు. 52

గీ. చెప్పినా నరసున్నల జేర్పలేదు
కన "టు ఎర్రీజుహ్యూమను" యనెడిమాట
సరసులగు మీరెఱుంగరే తిరుగ మీకు
నుడువనేటికి మాట దండుగకుగాని. 53